# "అస్పృశ్యతనుగూర్చినచర్చ" సమాధానము

సదాసివపేట ఆర్యసమాజ సదస్యులకు

మహాశయులారా! మీరు నన్ను గురించి చేసిన ౧౦ ప్రశ్నలకు సమాధానము వ్రాయుచున్నాను.

౧ "ద్వేవివబ్రహ్మణోరూపే మూర్తంచైవామూర్తంచ" అను బృహదారణ్యక మంత్ర వచనము ననుసరించి పంచభూతములందు మూర్తములని, అమూర్తములని, రెండువిధములగు భూతములున్నవని తెలియుచున్నది. ఆకాశవాయువులమూర్తము లగుటచేతను, మరియు "వాయుస్సర్వత్రగో మహాన్" అను ప్రమాణమునను సరించి వాయ్వాకాశ తేజములు, విశేషముగా సర్వత్రగమకముగలిగి మహావ్యాప్తములై యుండుటచేతను అంటుదోషము వానియందుండదు, ఇక మిగిలిన పృథివీజలములందు అంటుదోషము పాటింపబడుచున్నది. కాని మహత్వములుకానప్పుడే పృథివీజలాదులకు అంటుముట్టుదోషముండును. జలము ప్రవహించునప్పుడును, పృథివీ శైశాల్యమందును, దోషావహములుగావు, కుండలు మొదలైనరూపమున పృథివికి అంటుముట్టుయుండును. బావులందును, కుండలందును, యున్ననీళ్లకంటుముట్టుయుండును, అల్పత్వమే దోషమునకు కారణము. ప్రతిమంచివస్తువు యెంతెంతమహత్తయియుండునో అంతంత అందు దోష హారణ సామర్థ్యమధికమైయుండును. అన్నిరసములకుమూలము జలము సర్వజీవనాధారముగుటచే జలమునకు జీవనమని పేరు, "ఆపః పునంతుపృథివీం" అను వేదమువలన జలమెంతనిర్మలమైయున్నది అంతపావిత్ర్యం మొసగునది. కావున పంచభూతములందు జలమునకు ప్రాధాన్యతగలదు. నదులయందలి జలమెంత స్వచ్ఛముగానుండునో, బావినీళ్లుయుండవు. బావినీళ్లెంత స్వచ్ఛముగాయుండునో పాత్రగతజలముండదు—అనగా అల్పమైనట్లు మాలిన్యము శీఘ్రముగా సంక్రమించును. కావున పైజాతివారు క్రిందిజాతివారుముట్టిన యల్పజలాశయములందలినీరు ముట్టగూడదని యు, త్రాగగూడదనియు వేదాదిశాస్త్రములు విధించియుండుట చేతనే నావిధముగ నిరూపించుటకు నుంటిని.

౨ ద్విజ స్త్రీలుపతివ్రతలై తమసద్గుణ గరిష్ఠులగుచు అగ్నిహోత్రాదులను జరుపుచున్నచో కొన్ని మంత్రములమాత్రము పఠింపవచ్చును. కాని "స్త్రీశూద్రబ్రహ్మబంధూనాం త్రయీనశ్రుతిగోచరా" అను ప్రమాణము ననుసరించి స్త్రీ శూద్రాదులకు సర్వవేదాధికారములేదు శూద్రస్త్రీలకు వేదమునందు పఠనాధికారము మొదటికే లేదు. ఈవిషయము సత్యార్థప్రకాశికతృతీయ సముల్లాసమున బ్రహ్మచర్యోపదేశమునందు దయానందులవారు బహ్మచార్యకమ్మతమని సమర్థించి వారు—కావున అల్పవేదాధికారులగుటచే ద్విజ స్త్రీలకు గాయత్రీధారణ గాయత్రీపఠనాధికారము లేదని చెప్పబడియున్నది. గార్గీమైత్రేయీవంటి వేదప్రతిపాదిత స్త్రీలు దీనినుండి ముక్తసనాచెయ్యబడినారు. వారికే వేదాధికారముగల దని స్మృతులయందు చెప్పబడియున్నది

3 ఈ చిహ్నములన్నియు తత్తద్దేవతోపాసకులు వీరిని తెలుపుటకై వేదద్రష్టలగు మహాఋషుల వేదావిరుద్ధములగు స్మృతులయందలివి. నిషేధవేదమంత్రములు గాంచువరకు వేదసమ్మతములే—వారువారు ఉపాసించుదేవతాలోకమునకు వెళ్లుదురు—ఊర్ధ్వపుండ్రములు ధరించువారు వైష్ణవులుగావున విష్ణులోకమునకు వెళ్లుదురు. అడ్డుగంధాలు పెట్టువారు శైవులుగావున శివలోకమునకు వెళ్లుదురు మిగతవాండ్లవిసముగనే తమదేవతాలోకములకు వెళ్ళుదురు ఏచిహ్నములను ధరించనివారు శూన్యలోకస్థులు.

४ శైవవైష్ణవాదులందరును సనాతనులే కాని మతముమాత్రము వేరువేరు సనాతనమనునది వ్యాపకధర్మము—మతమనునది వ్యాప్యధర్మము—వ్యాపకధర్మమన్ని మతములలోను ఉండునదికావున ప్రాచీనమతములవారందరును (నాస్తికమతములనువిడిచి) సనాతనులమని చెప్పుకొందురు. హిందువులనగా హిందూదేశమునఆరంభమునుండి యున్నవారు—జేతీయత్వము తమయందు స్థాపించినప్పుడు హిందువులని చెప్పుకొందురు—

५ వర్ణములు, మతములు, కులములు,జాతులు, అసంఖ్యాకములు అవన్నియు వైదికములే—అనంతములగు వేదములయందు చెప్పబడినవి— వేదములు నాలుగేగదా! అంటే నాలుగురాసులనియర్థముకాని నాలుగేయనియర్థముకాదు— వర్ణజాతులవిషయమునందు యజుర్వేదమున ౩౧-వ అధ్యాయము చూడనగును—

౬ పరమేశ్వరునికి జీవకోటియంతా సమానమే—మనము పరస్పరము అసమానులము—పరమేశ్వరుడు నిర్దోషుడు— మనముసదోషులము— ఈశ్వరుడనంతశక్తిగలవాడు, మనమల్పశక్తులము—వాడు ప్రాణులుజేయు రహస్యా రహస్యకర్మలనన్నిటిని నెరుగువాడు—మనము మనము చేయునదే యెరుగము—వాడెల్లప్పటికిని యొకేరీతినుండువాడు—మనము క్షణక్షణమునకు మారుచుండువారము—ఈవిధముగ వానికిని మనకును సకలవిషయములందు తారతమ్యముగలదు— ఎన్ని ప్రయత్నములుచేసినను జీవుడు దేవుడుకాడనియేగదా? మీయభిప్రాయము— మరి వాని గుణకర్మస్వభావములు మనకెట్లులభ్యమగును— ప్రయత్నము జేయుచో లభ్యములగునని యంటే జీవుడు దేవుడేయగునుకదా! కావున వానిని సమనమందరియందును సమానముగా నెట్లుండగలము—సమశబ్దమునకు చాలా అర్థములున్నవి—ఈశ్వరుడు సముడనగా "నిర్దోషంహిసమంబ్రహ్మ" యను గీతావచనము ననుసరించి విద్యావినయములుగల బ్రాహ్మణునియందును ఆవుయందును, యేనుగయందును, కుక్కయందును చాండాలునందును యున్న భగవంతుడు వానివానియంతలి దోషగుణములకులోబడక అవ్యక్తుడుగను యున్నాడని అర్థము—ఈవిధిభగవంతుని నెరుగు పండితులే సమదర్శులు—కాని కుక్క,యేనుగు, బ్రాహ్మణచాండాలుడు, సములనుకొనుట వివేకలక్షణముకాదు—పరుకందరు పాత్రులేకాని న్యాయగుణమునకు యథాయోగ్యాధికారముగలవారు— మీయభిప్రాయములో ఉచ్చనీచభావములను పాటించకపోవుటయే సమమగునేని యిదిఈశ్వరసృష్టికి విరుద్ధమగును. మంచికర్మలనాచరించినవారిని భగవంతుడు మంచివర్ణములయందుపుట్టించినాడు.దుష్కర్ములను నీచవర్ణములయందుపుట్టించినాడు. ఈ ఉచ్చ నీ చ భా వ మే ఆయనయందు లేనిచో అందరిని సామాన్యముగ ఉచ్చవర్ణములయందే పుట్టించియుండును. వర్ణములయందుచ్చనీచమేమియులేదనియు, కావునయెచటపుట్టినను నొకటియేయనియు, మీరనుచో, "రమణీయాచరణా అభ్యాశోహయత్తే రమణీయాంయోనిమాపద్యేరన్ బ్రాహ్మణయోనింవా క్షత్రియయోనింవా వైశ్యయోనింవా అథయఇహకపూయాచరణా అభ్యాశోహయత్తే కపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చాండాలయోనింవా" ఛాం—ఉప—ప్ర—౫ ఖ—౧౦ అను మంత్రమును, సత్యార్థప్రకాశిక ౧౧ స—౫౩౩ పుటయందలి "మనుష్యులలోను బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర, అంత్యజాతి జాతిభేదములు ఈశ్వరకృతములు" అనువానికినివిరుద్ధమగును. జీవులయెడల మాకసహ్యతలేదు జీవులుధరించిన పాపశరీరమందసహ్యతగలదు అవిపాపశరీరములని శ్రుతిచెప్పుచున్నది. జీవులనుద్వేషించువారు సనాతనులేకారు.

౭ కులములు (వర్ణ—జాతులు) అనాదినిత్యములుకావున యవి యేనాటినుండివచ్చినవనియనుట తప్పేయగును. ఆకాలములోనుండెను, యీకాలములోనున్నవి— ముందటికాలమునందుయుండును జీవత్వమునశించినగాని జాతులునశించవు—కావున వేదములయందు పలుచోట్లచెప్పబడియున్నవి. వేదములేనాటివో వర్ణజాతి విభాగములునాటివే. పాండవులరణ్యములకు పోవునప్పుడు ధౌమ్యుడును విదురునియింటిలోను భుజించలేదు. భుజించినట్లు ప్రమాణములను చూపించినప్పుడు విచారము యాదవులు, క్షత్రియులుకావున అర్జునుడు సుభద్రను, శశిరేఖను అభిమన్యుడును వివాహమాడుటలో తప్పులేదు. భాగవతదశమస్కంధము, భారతఆదిపర్వమును చూడుడు యుద్ధములందుయేవిధముగ చేసినను మనకు సంబంధములేదు. ఆజిమహాపశ్చాత్—అవిషయము నలనీలాదులు వానరులుగావున ఫలమూలాదులచేతనే వారిభోజనము రామలక్ష్మణులు వానప్రస్థులు.

౮ పంచములను అస్పృశ్యులందురు. పరమేశ్వరుడు భగవంతుడు గావున ఆయనకు చాండాలస్పృశ్యలకలుగుదోషమంటదు. మనకుగూడ అంటదని అంటేదేవుడు మంచిదానిలోయున్నాడు చెడ్డవస్తువునందున్నాడు మనమాలాగేయుండగలమా? మురికినీళ్లలోవేస్తే నీళ్లుమురికియగును. అగ్నిలో వేసినకాలిపోయి అగ్నియున్నట్లైయుండును. బసవేశ్వరాదులు అవతారపురుషులు గావున పైవిధి నే వారికిని మనముగూడ అవతారపురుషుల చేయుని అనుకొనుచో మృతులను బ్రతికించవలయును. వారిచరిత్రములువారికేతగును.

౯ కబీరాదులు మూర్తిపూజాభంజకులుగారు—మూర్తిపూజారంజకులు. రాళ్ళయందు పూజించుచున్నరుకాని రాళ్ళను పూజించుమనిచెప్పలేదు సనాతనులు చేయుపూజ ఈలాంటిదే. దయానందులు రాళ్ళయందు దేవుడులేడు రాళ్లనుపూజింపకు డన్నారు.

౧౦ సనాతనులు స్వమతద్రోహులుకారు కావున ధర్మమువీడి పతనిపొందరు. "ఏకోదేవః కేశవోవాశివోవా" యిత్యాదులే ప్రమాణములు,

ఇట్లు

లోకూరి రాఘవేంద్రాచార్యులు.

[చర్చసంక్షిప్తముగాను అవసరప్రసంగవర్జితముగాను వ్యక్తిదూషణరహితముగాను ఉంటే కొనసాగించబడును. లేనిచో కొంతభాగమో అవసరమైతే పూర్తిభాగమో ఎత్తివేయబడును. గో. ప.]

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర శ్రావణ శు॥ ౧౫

గురువారము


## జరీదా (గాలెట్ సరం క్యూ) దానము

ఫర్వర్ది ౧౬, ఫసలి ౧౩౪౭ నాడు "పత్రికలకు ప్రభుత్వాదరణము" అను మా సంపాదకీయములో ఇట్లు వ్రాసియుంటిమి.

" ఇంచుమించు ౧౦౦౦౦ రూపాయిలు ఒక్కసంవత్సరములోనే, ఒక్క రహబరె దక్కన్ పత్రికకు ముట్టినవి. " ప్రపంచములో పత్రికలకెందును ఇంతటిచంటిబిడ్డ పోషణ జరుగుటలేదు. ఏ పత్రికస్వతంత్రముగ నిలిచి పాఠకులను తృప్తిపరుప జాలదో అట్టిదిజీవించియుండుటకుగాని సహాయము పొందుటకుగాని అర్హత నొందజాలదు. దానికి వెంటనే శ్రాద్ధకర్మ చేయవలసినదే, ప్రజలను తృప్తిపరుపగలిగి వారి ఆదరణ పొందుస్థితిలోనుండు పత్రికలకు ప్రభుత్వ సహాయమనవసరమని వేరే చెప్పపనిలేదు. " ఇట్లు రెండువిధములను పత్రికలకుసహాయము అనవసరము!!

పై విమర్శన ఫలితముగా మూకును ఆకాలములో ప్రభుత్వపక్షాన ఉచితంగా లభించుచుండిన టెలిగ్రాములు ఆపివేయబడెను. మావలెనే అందరికినీ వర్తించవలెనని మేము ప్రకటన శాఖవారితో మొరపెట్టుకొంటిమి. " అది కూడా మా ఆలోచనలో ఉన్నది" అని వారు ప్రత్యుత్తరమిచ్చియుండిరి. కాని యింతవరకు హైద్రాబాదు దినపత్రికలకుపత్రికా టెలిగ్రాములు ఉచితముగానే లభించుచున్నవి.

తేరకు తేరగా ఏదైననాదొరుకుతుందంటే తండ్రీ కొడుకూ ఇద్దరు సిద్ధమౌతారట. ప్రతిఫలమిచ్చుకోవలెను సుమా అంటే తండ్రి " నేను ముసలివాన్ని" అంటాడట. మరి కొడుకేమో "నేనుపిల్లవాన్ని" అంటాడట! అట్లే ఉంది, మనరాష్ట్రములోని కొన్ని పత్రికల వ్యవహారము. ఉచితంగా లభించితే బాగుండును పైకమియ్యవలెనంటే కష్టము అనేధోరణి మనపత్రికలది.

మన హైద్రాబాదు ప్రభుత్వము వారు జరీదాలను (గజెట్లను) దినపత్రికలకును, కొన్ని వారపత్రికలకును ఉచితముగా దానమిచ్చుచున్నారు. కేవలం అట్టి పత్రికలకే కాక యితరులకును ఇచ్చుచున్నారని ముషీరెదక్కన్ పత్రిక ౩౦ షహారెవరునాటి పత్రికలో ఎత్తిచూపింది. ఎట్లనగా ౧౩౪౭ ఫసలీలో జరీదాను పైకమిచ్చికొన్నవారు ౭౫మంది మాత్రమే. ఉచితంగాదానినిపొందినవారు ౬౬౩ నుంది! ఈసందర్భములో తిరువాన్కూరుసంస్థానంవారు కూడా అట్టి ఔదార్యమునే ప్రకటించినారనియు అందుచేత ప్రభుత్వవారు పత్రికలలో కనిష్ఠము దినపత్రికలకైనా జరీదానుఉచితముగాఇయ్యవలెననియు ముషీరువారు వ్రాసినారు ఈ అభిప్రాయముతో మేము భిన్నించుచున్నాము. హైద్రాబాదు నగరములో కొందరు పత్రికాధిపతులు పత్రికాప్రచారకసంఘమును ఏర్పాటుచేసుకొన్నారు. వారొకతీర్మానము చేసినారు "జరీదాను అన్నిస్థానిక పత్రికా రచయితలకు ప్రతిఫలాపేక్షా రహితముగా ఇయ్యవలెను." అని తీర్మానించినారు. ఆతీర్మానములో "స్థానిక" అనినయేమో? జిల్లాలలోని పత్రికలకు ఉచితముగా జరీదాకూడదనేనా? పత్రికల రచయితలంటే యేమి? అది స్పష్టముగాలేదు. కాని "అన్ని" అనేదిమాత్రము స్పష్టంగా ఉంది. ఆ "అన్ని"లో మావంటి చిన్నలును చేరుచున్నారు. ఇది ఔదార్యముతోకూడినన్నిర్ణయమే!

ఇందుమాకథకొంత తెలుపుకోనవలెను. మాకు జరీదా మొదటినుండియు వచ్చుటలేదు. ఒకటి రెండువారపత్రికలకుకూడా లభించుచుండెనని విని మేమును అభ్యర్థులమైతిమి. మొదట స్టేషనరీవారికి చిత్తగింపువ్రాసుకొంటిమి వారు మమ్ము ఫైనాన్సుకుపోయి సెలవుపొందుమనిరి. తర్వాత ప్రభుత్వప్రకటన శాఖవారికి మాకై సిఫారసుచేయుడని మనవిచేసుకొంటిమి కొన్నిమాసాల తర్వాత మరొకమారు ఇటీవల వ్రాసుకొంటిమి. " జరీదాఎవ్వరికినీ ఇకముందు ఉచితముగాఇయ్యబడదు" అని జవాబువచ్చెను మాకేమో ప్రాగభావవిరక్తి. ఇదివరకుపొందువారికేమో ప్రధ్వంసాభావ విచారము. ఎట్లైతేనేమి ఉభయులమునుప్రధ్వంసాభావ ప్రాగభావతర్కములో ఇరుకుకొన్నాము.

మేము ౧౩౪౭ ఫసలీలో చెప్పిన మాటనే మరల చెప్పుచున్నాము. పత్రికలు ప్రభుత్వసహాయముపై ఆధారపడియుండకూడదు. ౬౬౩ జరీదాలు ఉచితముగా సప్లయిఅగుచున్నవంటే ప్రభుత్వానికెంతనష్టము. మనరాష్ట్రములో ౭౦ పత్రికలున్నవి. అందు మాసపత్రికలను వదలి వార దినపత్రికలు మాత్రమే ౧౮ పత్రికలున్నవి. ఇవన్నియు జరీదాకొనవలెను. లేదా మానుకోవలెను. తిరువాన్కూరు సంస్థానమువారును ఉచితముగా ఇచ్చినందున అది అనుకరణీయము కానేరదు. వారిదికూడాతప్పే! అయితే బ్రిటిషిండియా మాటయేమి? ప్రతిమండలము (ప్రావిన్సు)లోను ఒకమాండలిక గజెటు ముద్రితమగును. అవిమాండలిక పత్రికలకు ఉచితముగా ఇయ్యబడుచున్నదా?

ఈ సందర్భములో మేము ఒక సూచనను చేయుచున్నాము. ప్రభుత్వము వ్యవస్థాపక సంబంధమైనట్టి మరియు పత్రికలలో ఇచ్చేఅంత ప్రాముఖ్యతలేని జరీదాభాగమును వేరుచేసి మరొకభాగములో ముఖ్యమైన ఆజ్ఞలు, శాసనములు మున్నగునవి ముద్రింపవలెను. ఆభాగమును పత్రికలకు తక్కువ క్రయమునకు సప్లయిచేయవచ్చును. ఉచితముగా సప్లయి చేయుదురా అది అన్ని వార్తా పత్రికలకును (మాసపత్రికలకనుఅంతకుమించి దినకాలపరిమితికల పత్రికలు వార్తాపత్రికలుకానేరవు కావున) సమానముగాచేయవలెనే కాని దినపత్రికలకు మాత్రమే అనుగ్రహించుటలో విశిష్టతయుండదు.

నిజముగా మన ప్రభుత్వమువారి ఔదార్యమును మెచ్చుకొనవలెను. వారు మన రాష్ట్రపత్రికలకు మంచి సహాయము చేయుచున్నారు.

## సైన్యంభర్తీ

### అబద్ధం

(ప్రభుత్వప్రకటన శాఖవారిట్లు తెలుపుచున్నారు, హైద్రాబాదురాష్ట్రములోని జనులనుబలవంతముగా సైన్యంలోభర్తీచేయుచున్నారను వదంతులు హైద్రాబాదునగరంలో చాలవ్యాపించినట్లు ప్రభుత్వంవారిదృష్టికివచ్చినది. ఈవదంతులన్నియు నిరాధారములనియు పూర్తిగా అబద్ధములనియు ప్రభుత్వమువారుప్రజలకు తెలియజేయుచున్నారు- ఇట్టివదంతులను వ్యాపింపజేయువారికి హైద్రాబాదుసంరక్షణ నియమావళి ప్రకారం శిక్ష చేయబడును-

## తిరుమలగిరి

### వైశ్య యువజనసంఘము కార్యవర్గ పునర్నిర్మాణము

(ఒ-వి) ౩౧-౭-౧౯౪౧

తిరుమలగిరి బజారునందలి ఆర్యవైశ్యయువజనసంఘమునకు నూతన కార్యనిర్వాహకవర్గము నెన్నుకొనుటకై గడచినజులైనెల ౨౭వ తేది రాత్రి సంఘభవనమందు సభ జరుపబడినది. సభకు శ్రీ మంచికంటి వీరయ్యగుప్త గారు అధ్యక్షత వహించిరి,

జవ్వాజి సుబ్బరాయగుప్తనిర్జాంతిగారు యువజనసంఘములయొక్క కర్తవ్యములనుగూర్చియు, సంఘపరిస్థితులగురించియు రెండుగంటలకాలము ఉపన్యాసముగావించిరి. అనంతరము కార్యవర్గపు యెన్నికలు ఓటింగుపద్ధతిగాజరుపబడి యీక్రింది కార్యవర్గ మెన్నుకొనబడెను-

అధ్యక్షులు- శ్రీ పెద్ది రామయ్యగుప్త గారు, ఉపాధ్యక్షులు- మంచికంటి వీరయ్యగుప్త గారు, ప్రధానకార్యదర్శి- అనాచి రాజయ్యగుప్త గారు, సహాయకార్యదర్శులు- అకుల రాజయ్యగుప్త, అల్లాడి వీరయ్యగుప్తగార్లు, కోశాధిపతి- వేముల నారాయణగుప్త గారు, మరిఆయిదుగురిని కార్యవర్గసభ్యులుగాకూడా ఎన్నుకొనబడెను.

## హైదరాబాదునగరానికి ఇంకొక కళాశాల

(ఒ-వి)

హైద్రాబాదు-దక్కన్ షహాబేవర్లీ ఈనగరమందు గౌలిగూడములో విశేషవర్తనతోనున్న కళాశాలయున్నది. దానికి శాఖలనుకూడ ఏర్పాటుచేయుటకై ప్రయత్నములుజరుగుచున్నవి. కళాశాలఏర్పాటుచేయుచో ప్రభుత్వమువారిల మోదమును దానికుంచుటకై ప్రయత్నము- చేయుచున్నారు మన రాజువిద్యాపీఠపద్ధతికి ఈకళాశాలనుచేర్చెదరని కనిపించుచున్నది.

## బావులక్రిందపన్ను

పాతబావులక్రిందనుండే భూముల పైని పన్నులలో రూపాయికి ౦-౧౦-౮ శాశ్వతముగా మ. ఘ. వ. ప్రభువుగారు మాఫీచేసినారని హైద్రాబాదు సమాచారము అను ప్రభుత్వ ప్రకటన శాఖవారి మాసపత్రికలో ప్రకటించినారు. దానిని స్థానికపత్రికలన్నియు ప్రకటించినవి. ముషీరెదక్కన్ వారు తమ సంపాదకీయములో ఇంతవరకట్టి ఆజ్ఞ కాలేదని స్పష్టపరచినారు. కాని ప్రజలు చాలా మంది నమ్మక వచ్చి విచారించి పోవుచున్నారు. జాబులుకూడా వచ్చుచున్నవి. ఈవిషయమై ప్రభుత్వప్రకటనశాఖవారు వెంటనే అది నిజమో కాదో, యేదో ఒకటి స్పష్టపరచి అనిశ్చితప్రకటన చేయవలెనని కోరుచున్నాము.

## గోలకొండ డైరీ

౧౩౫౧ ఫ.

౫౦౦ ప్రతులు ఈవారంలో అమ్మకమైనవి.

★ ★ ★

ఒక నెలలో అన్నీఅయిపోవచ్చును.

మళ్లీ నిరాశ అగును.

వెల- క్యాలికో ౧౪ అణాలు.

సగంచర్మం ౧-౪-౦ పూర్తిచర్మం ౨-౨-

చర్మంమీద పేరువేస్తే ౪ అణాలెక్కువ బైండుకాని డైరీ ౧౨ అణాలు,

■ ■ ■ ■

- కాగితాలధర రెండంతలు పెరిగింది.
- డైరీ చాలాపెరిగింది.
- వెలమాత్రం పెరుగలేదు! !

## వర్ణాంతరవివాహాలు

### పూర్వములో చాలాలేకుండెను ఇప్పుడుకూడఉండకూడదు

గోలకొండపత్రికలో "వర్ణాంతరవివాహాలు" అనువ్యాసమువచ్చినది. లాహోరులోని జాత్ పాత్ తోడక్ మండలికార్యదర్శి గారు వర్ణాంతరవివాహాలు శాస్త్రసమ్మతములని చూపించినదిదృష్టాంతములు అబద్ధములై సత్యదూరములైయున్నవి గాన వీరివాక్యములనునమ్మి పూర్వాచార పౌరాణికవర్గమువారెవరును తమభావములను, ఆచారములను మార్చుకొనవసరములేదు- వీరిమోసపు మాటలకు నిజస్థితి తెలియనివారెవరైన మోసపోవుదురేమోకాని పురాణములను బాగుగ వివేకదృష్టితో, ప్రమాణబుద్ధితో చదివినవారెవరును వీరి వలలో పడజాలరు-

ప్రియవ్రతుడను క్షత్రియుడు పెండ్లియాడిన బర్హిష్మతి విశ్వకర్మయను బ్రాహ్మణకూతురుగాదు. విశ్వకర్మయను దేవశిల్పి- (భాగవతపంచమస్కంధము) ప్రమత్తయను బ్రాహ్మణకన్యక బ్రాహ్మణునివివాహమాడి మంగలివానితో వ్యభిచరించుటవలన మతంగుడుపుట్టినాడు- కావున ప్రమత్తమంగలివానిని వివాహమాడలేదు- మతంగుడు బ్రాహ్మణుడుకాలేదు-[భారతముఅనుశాసనికపర్వము] వసిష్ఠుడు బ్రహ్మదేవునికుమారుడు గాని భోగముదానికుమారుడు గాడు-(స్కాందము అ ౩ శ్లోకము ౧౨)

కర్దముడు బ్రాహ్మణుడుగాని క్షత్రియుడుగాడు(భాగవతము తృతీయస్కంధము)

అరుంధతి బ్రాహ్మణకన్యకగావున, వసిష్ఠుడామెను పెండ్లియాడి శక్తియనుకుమారునిగనెను-ఈ శక్తి అదృశ్యంతియను బ్రాహ్మణకన్యకను వివాహమాడెను-అదృశ్యంతి చాండాల కన్యకయని యేగ్రంథమునవ్రాయబడియుండలేదు- అదృశ్యంతియను బ్రాహ్మణకన్యకయందు పరాశరుడుపుట్టియున్నాడు-(భారతమాదిపర్వము) సత్యవతి ఉపరిచరుడనువసువుయొక్క కుమార్తెగాని బెస్తవాడైన దాశరాజుకూతురుగాదు-వసువు దేవజాతివాడుకావున ఆయనకుబుట్టిన సత్యవతి దేవజాతిస్త్రీయగును- అపత్యవతియును దేవజాతిస్త్రీయుందు సద్యోజాతుడైనవ్యాసుడు పరాశరునివలన పుట్టియున్నాడు-కావున వ్యాసుడు బెస్తవానిబిడ్డయందుబుట్టినవాడుకాడు(భారతమాదిపర్వము)

వ్యాసుడు కురువంశవినాశకాలమున సత్యవతిదేవిచే ప్రార్థితుడై అంబా, అంబాలికయను భ్రాతృభార్యలయందు నియోగవిధిగా పుత్రులగనినాడేగాని ధారాదత్త వివాహమాడిగాని, విధవావివాహముచేసుకొనిగాని పుత్రులగనలేదు-నియోగము వివాహముకాదు- (భారతమాదిపర్వము)

పాండవులు దేవతానుగ్రహజనితులు- కావున వారిజననము వివాహమునకుగాని నియోగమునకుగాని సంబంధించినదికాదు- (భారతి మాదిపర్వము)

కర్ణుడు వివాహజనితుడుకాడు కానీనుడు. (డిటో)

బభ్రువాహనుడు సవర్ణవివాహజనితుడుకాడు- బభ్రువాహనునితల్లి చిత్రాంగద చిత్రవాహనుడను క్షత్రియునికుమార్తె ఘటోత్కచుడును అసవర్ణవివాహజనితుడుకాడు- హిడింబి రాక్షసి యనుటయేగాని వాస్తవమున క్షత్రజాతిస్త్రీయే (డిటో)

పూర్వము వేదకాలమున జరిగినవివాహముల లో సూతికి (?)పాళ్లు సవర్ణవివాహములే

ఇక చారిత్రిక నిదర్శనవిషయము చరిత్రలువిదేశీయులచే విశేషముగవ్రాయబడినవి కావున నమ్మదగినవికావు-ఒకవేళ నమ్మినను యిందుచూపబడినవిదర్శనములు పౌరాణిక కాలమునాటివిగావు-గనుక పౌరాణికవర్గమువారికి, సనాతనులకంతగా ప్రమాణములుకావు-

ఇట్లు

వందిగామ-దత్తాత్రేయరావు

కోడంగల్, ౨౯-౧౦-౧౩౫౦

(ఈ చర్చపై అనుకూల ప్రతికూలవ్యాసములు వ్రాయువారు, వీలవలెనే సంక్షిప్తముగా వ్రాయవలెను-కాని దీనిఆదిలోనున్నట్లుగా వ్యక్తిదూషణములుండకూడదు- వీలైనంతవరకు ప్రమాణము అను ఊరక అముకపర్వము, ఖండము, స్కంధములనక అముకఅధ్యాయము, అముకశ్లోకము అని స్పష్టముగా చూపించవలెను- చారిత్రికములుగా అముకగ్రంథము అముకపత్రములని నిరూపించవలెను-గో-ప-సం)

## అస్పృశ్యతానివారణను కొచ్చిను శాసనసభ కోరుట

కొచ్చిను సంస్థానశాసనసభ ఆగష్టు౨వతేదిన సమావేశమైనపుడు దివాన్ వేణ్కటరమన్, భూమ్యాదాయశాఖమంత్రియునగు ఏ. మాధవప్రభువు గారు తమశాఖకైకొరతగ్రాంటునుగురించి జరిగిన చర్చవరుసలో మధ్యాహ్నము ఫలాహారానంతరము ఒకకొత్తతీర్మానముప్రతిపాదింపబడినది. ఒక ప్రకటనచేకొచ్చినుసంస్థానములో అస్పృశ్యతను తీసివేయవలెనని ఆతీర్మానమునందున్నది. ఈతీర్మానమునకు సభయందలి ప్రభుత్వసభ్యులుమాత్రము ప్రతిఘటించిరి, కాని ప్రభుత్వేతరసభ్యులందరును దానినామోదించిరి.

ఇక్కడ వరియర్ గారుమాట్లాడుచు ఈనురాచారముక్రమక్రమముగ అదృశ్యమగుచున్నను, చాలాజనమునకు అదిమనస్సుకు కష్టముగనున్నదనిరి-

యం. కె. దేవస్సీ గారు కొచ్చిన్ వర్గసంకటనిర్మూలనశాసనము చాలఅలస్యముగాఅమోదించిరనియు, దానికిప్రభుత్వసభ్యులంగూడ ప్రతికూలించలేదనియు, ఆశాసనముగతిఏమైనదియు తెలియుటలేదనియుచెప్పిరి.

కె. అయ్యప్పన్ గారుఇటువంటి అస్పృశ్యతాచారముల నవలంబించువారల ఆత్మగౌరవము నుకాపాడుటకే అఅస్పృశ్యతాచారమును తీసివేయుటఅవసరమనిరి. కొచ్చినువంటిఅభివృద్ధి మార్గంలోనున్నదే సంస్థానాలలో అస్పృశ్యతఇంకనుఉండుట తగదనిచెప్పిరి

